పరతత్త్వజ్ఞుని సాధుసత్పురుషుఁగొల్వన్ తత్కృపావీక్షణం
బురహస్యంబది స్వానుభూతమయగున్; మూఢుల్ పరప్రత్యయుల్;
పెర 'ఔఁగాముల' తోడనేమిపని; బీ. వీ. దేవు వృత్తంబు నం
దెఱుఁగన్జేయుసె? మద్విధానముల; ఏమీ, నిన్నుపేక్షింతునా? 23

మది నిర్వంచితభక్తి నన్ను భజియింపన్నేర్చు నావానికే
కొదవల్కల్గవు; వానిభారములఁగైకొందున్; వృథాచింతనల్
గదురన్ వ్యాకుల మందనేపని? – నిమోన్కర్ వృత్తమున్ నిల్పుమీ
హృది, సుశ్రేయ పథంబునీకిడుదు; ఏమీ, నిన్నుపేక్షింతునా? 24

కృతులన్ లాఘవగౌరవంపు తలఁపున్ గీలింపకే, స్వార్థమే
గతినిన్జేరఁగనీక, ప్రేమఁ బఱుపం జూడుమీ! జీవసం
తతి; 'అబ్దుల్' చరితంబునేమఱకు స్వాంతంబందు; నీప్రాపునై
కృతకృత్యున్ బొనరింతు; నమ్ముమిది; ఏమీ, నిన్నుపేక్షింతునా? 25

క్షితి నీకర్హ తలేని కామితము లాసింపంగరా; దే నొసం
గితి నా నిల్పు కొనంగనేర; వనురక్తిన్ నన్ను జింతింపు! స
ద్గతిఁజేకూర్చెద; నిల్పు నాపయిని యోగక్షేమ భారంబు; నీ
యితరాలోచనలెల్ల మానుమిఁక; ఏమీ, నిన్నుపేక్షింతునా? 26

కల, యీజాతి మతాదులన్నిటను లోకస్వామితా నొక్కఁడై
వెలయున్; భక్తులు నామరూప పదముల్ వేర్వేఱఁ గల్పింత్రు; త్రో
వలు వేరైనను గమ్యమేక, మిది విస్పష్టంబు: నీబాట న
ర్మిలి నీవేగుట శ్రేయమౌననె? ఏమీ, నిన్నుపేక్షింతునా? 27

నను గుర్తింపఁగ లేక విభ్రమతుఁడై నన్ నాకు సంబంధియౌ
జను, నేనేదఱిఁజేర్చుకొందు, నిఁక వైషమ్యానురాగాల రెం
టినిఁ బోకార్చుదుఁ జక్కదిద్దెదను; భాటేన్రామదాసా నుయా
యిని, రక్షించిన చందమున్ గనవె? ఏమీ, నిన్నుపేక్షింతునా? 28

నను సేవించుచు నాదు నామము ననన్య శ్రద్ధస్వాంతంబునన్
మననంబున్ బొనరించు నాశ్రితుల, సంబంధీయులౌ వారి చెం
తన నేనుందు, హితంబుఁ గూర్చుదును; చంద్రాబాయినిన్ బ్రేమనో
మిన వృత్తంబు సమాలకింప వొకొ? ఏమీ, నిన్నుపేక్షింతునా? 29

ప్రతిమన్ జిత్రపటంబునందునను సంభావించినన్ లేక, ప్రా
కృత దేహంబునఁగొల్చినన్ సమము; నాయీ సర్వ, భూతాత్మక
స్థితి మాత్రంబెద విస్మరింపకు మినన్ సేవింప! 'బాలాబువా'
యితి వృత్తంబునఁ బోధఁజేయనొకొ? ఏమీ, నిన్నుపేక్షింతునా? 30

దురహంకార దురాగ్రహంబులవి శత్రుల్ వాని, బోకార్చి, యె
త్తఱినిన్ లౌకికవాంఛలన్ దవిలి కుందన్బోక, వైరాగ్య వి
స్ఫురణన్ నిర్మల భక్తి సేయు, మిట బాపూసాహెబున్ జోగు నా
యిరవున్జేర్చి యనుగ్రహింప నొకొ? ఏమీ, నిన్నుపేక్షింతునా? 31

అనురాగంబున భక్తి తత్పరత నీవర్పించునే స్వల్పమై
నను సంప్రీతినిఁ గొందు! జీవచయమున్ నన్నట్టులీవాదృతిన్
దనుపన్ జూచెదవేని మెలిడుదు; మాతార్కాడ్ కుటుంబంబునో
మిన వృత్తంబు సమాలకింపవొకొ? ఏమీ, నిన్నుపేక్షింతునా? 32

అవతారంబులు సద్గురూత్తములు ప్రత్యక్షంబునౌ దైవ, మ
ట్లవుటన్ సందియముల్ త్యజించి, చిరమత్యాసక్తి నేకైక ల
క్ష్యవిధిన్ గొల్వుమి, నమ్మియోరిమి, పిఁపేలంబాడెకర్ పంతు లం
దెవరిన్గాదని త్రోసిపుచ్చితిన? ఏమీ, నిన్నుపేక్షింతునా? 33

చలచిత్తంబుఁ ద్యజింపు మీవిఁకను విశ్వంబందు బ్రహ్మజ్ఞులా
కల రెందెందఱొ; వారభిన్నులని, యేకంబంచు గుర్తింపు; మె
వ్వలనన్ నీగురుదేవునే కనుమి; ఆవస్తే యుదంతంబు నం
దెఃమిన్ దెల్పనె సత్యతత్త్వమిట; ఏమీ, నిన్నుపేక్షింతునా? 34

కలుముల్ లేములు, సౌఖ్యదుఃఖములు ప్రాక్కర్మాను సారంబుగాఁ
గలుగున్ జీవికిఁ, గాని నేన్ శ్రితునకై కల్పించు మార్గాలు మో
హలతాచ్ఛేద కరంబులౌను, నరసింహస్వామి వృత్తాంతమం
దెలమిన్ దెల్పనె? మద్విధానముల; ఏమీ, నిన్నుపేక్షింతునా? 35

—:[ం]:—

# కృతి సమర్పణము

జలనిధి జలములఁగొని యా
జలనిధికిన్ దర్పణంబొసంగునటుల నీ
పలికిన పలుకులఁదెలుగున
బలికి సమర్పింతు, సాయివ్యాసా ! కొనవే !

# పూజ్యులు శ్రీ బి. వి. నరసింహ స్వామిజీ



## అంజలి

శ్రీసాయినాథ కథారసమును, విశ్వమంతటఁ ద్రావఁ బెట్టినాఁడు,
సాయీమహారాజ సత్సూక్తులభయప్రదానబోధలఁ బ్రజన్ దనిపినాఁడు,
సాయిబాబా విశిష్టావతారాంచిత, వృత్తమెల్లర కెఱిఁగించినాఁడు,
సాయీశ పదభక్తి – జాతిమతాది వైషమ్యదూరంబని చాటినాఁడు,

అఖిల భారతసాయి సంఘాధినేత
సాయి సద్గురు వ్యాసుఁడౌ, స్వామి – బీ. వి.
నారసింహుని దివ్యపాదారవింద
ములకు భక్తిమై నిత్యమంజలి ఘటింతు.

# మంగళ హారతి

శ్రీరామసాయి! సిద్ధావతార! – శ్రితజనమందార !
ద్వారకామాయీ భవనవిహారా! – భవభయ పరిహార !
హారతి– కప్పురహారతి– మంగళ– హారతినర్పింతు.
కారుణ్యమున జీవాళినిఁ బ్రోతు– కరములజోడింతు.
నీబిడ్డలమిదె! నీపదరజమున– నెమ్మినిఁ వ్రాలెదము
బాబా! ఆసల పాల్పడఁజేయక– పరమపదంబిడుము !
ఎవరెవ రెటులాశ్రయింతురొ వారి– నీవటులేలుదువు.
వివరింప నీ మహత్త్వమపారము– విశ్వాధారుఁడవు.
నీనామతరణి నిశ్చయముగ భవ–నీరధి దాటించు
దీనజనంబుల దిక్కువు సాయీ–దేవా! కరుణించు !
సగుణబ్రహ్మముగ జగతిఁ బొడమితి–సాయీ! హరివీవు.
అగణితనిగమాగమాదులేన్ ని–న్నరయంగ నేరవు.
శరణాగతదీన రక్షకుడవను– శపథంబు నిల్పుము !
వరదా! వరదాఽభయ కరముఁబఱపి – ప్రణతుఁ నొమ్ముము !
అనయము నీశుభ పదసేవన భా–గ్యంబును మాకిడుము !
హనూమచాతకమును సాయీవన – దాంబువులఁ దన్పుము!

తో॥ నీరాజనంబు నీకిదె-సాయీ! – నితాంతజగదాధార !
ద్వారకమాయీ భవనవిహారా! స్వాశ్రిత జనమందార ;

——

మాతృశ్రీ ప్రింటర్సు, బాపట్ల - 522 101.

శ్రీసాయీ నిలయము ప్రచురణములు:

కీ. శే. శ్రీ బాపట్ల హనుమంతరావుగారి రచనలు.

1. "ఏమీ ! నిన్నుపేక్షింతునా?
శ్రీ షిర్డి సాయిబాబా జీవిత చరిత్ర - భక్తుల అనుభవములు
5 సంపుటములు 1200 పుటలు. రు. 30/-
2. శ్రీసాయీ అనుసరణము 354 పుటలు రు. 12/-
3. శ్రీసాయీబాబా పూజా స్తవములు 88 పుటలు రు. 2/-
4. శ్రీరామా! ఆపదుద్ధారకా! (శతకము) రు. 1/-
5. శ్రీ హనుమాన్ చాలీసా! రు. 1/-
6. శ్రీ సాయిదేవ శతకము రు. 1/-
7. శ్రీవేంకటేశ్వర సుప్రభాత గీతములు మరియు శ్రీలక్ష్మీ నారాయణ స్తోత్ర మంజరి. రు. 3/-
8. శ్రీమద్భగవద్గీతామృతము రు. 12/-
9. సాయీబాబా కూడ దేవుడేనా? ఉన్న దేవుళ్ళు చాలకనా? (సందేహ నివృత్తి) రు. 8/-
10. శ్రీసాయీ సుభాషితములు రు. 8/-
11. శ్రీహనుమ గీతికా తారావళి రు. 1/-
12. శ్రీసాయీనాథ బోధామృతము 432 పుటలు రు. 20/-

(తపాలా ఖర్చులు ఉచితము)

---

ప్రతులకు:-

బాపట్ల వేంకట పార్థసారధి

శ్రీసాయీ నిలయమ్, చెరువు (P.O)

గుంటూరు జిల్లా; PIN 522113.